# [illegible]సుబోధిని.

దాట్ల సీతారామరాజుగారిచే రచియిం
పబడి



సి. హెచ్, రామమూర్తి అండ్ స
న్సువారి స్వకీయ ముద్రాక్షరశాల
యందు ముద్రింపించి ప్రచురింప
బడియె.

మొదటికూర్పు 630 ప్రతులు

విజయనగరము.

వెల రు 0-1-0.

1910

PRINTED BY MUKKU ATCHUPARAMAYYA.




శ్రీరాము.

# సతీసుబోధిని.

:(o):

క॥ నిరతంబు భక్తకోటికిఁ। బరమంబగు సౌఖ్యమెం
సఁగిపాలించెడి శ్రీ। కరుణాద్యంత విహీనునిఁ।గరుణా
నిధి దేవదేవు గణుతింతుమదిన్॥

క॥ పలువురు చెప్పిననీతులె। పలికెను లేవిందనూ
త్న పద్ధతులంచుం। దలఁపోయుచు నిరసించఁగ। వల
దుసుఁడీమంచిఁగొనుఁడి భావములోనన్

గీ॥ తప్పులున్నను వైకొక తప్పకుండ। సారమే
గ్రహించు నెప్పుడు సజ్జనుండు। నీళ్లుపాలుమిళితమైన
నీళ్లవిడిచి। పాలఁగొనునట్టి రాయంచపక్కిఁబోలె॥

క॥ పాతివ్రత్యమహాత్యము। చేతనరుంధతి
మొదలగుచేడియలెంతో। ఖ్యాతిఁగనిరి వారివ
లెన్।భూతలముననడచుకొమ్మ పొలఁతీనీవున్॥ 1

క॥ పతిభక్తి కంటెమించిన।వ్రతంబులేదుపయి
డలికిభామామణిరో। మతిఁదలఁపోయనదివినా।
వ్రతముల నోములనొనర్చవట్టివృథసుమీ॥ 2

క॥ ఉపవాసంబులు వ్రతములుఁ।దపములుఁ
వేలకంటెఁదర్కింపంగా। నపరిమితపుణ్యమ

క॥ పతిదైవమంచు నాతని। హితమెఱిఁగి మెలంగు
నట్టి మెలనాగలకుఁ। క్షితియందు సర్వసౌఖ్యము।
లతులితముగఁ గల్గుచుండు నత్యంతంబుఁ॥ 4

క॥ పతికంటె మించు దైవము। సతీమణికి లేఁడు
మదినిఁ జర్చింపంగా। క్షితిలో నాతనికి మిగుల।
హితముగ నడవంగ వలయు నెల్ల విధములఁ॥ 5

క॥ నవమాసంబులు గర్భము। నవహించి మిగు
లశ్రమఁగొని నజనని యెడల। న్నవలా భక్తి శ్రద్ధ
ల। నవని నెలగంగ వలయు నార్యులు మెచ్చఁ॥ 6

గీ॥ వెలఁది విద్యయు బుద్ధి నేర్పించి యోగ్య। వం
తురాలినిఁ గాఁ జేసి స్వాంతమందు। నాకెకును నీదు
సౌఖ్యంబుఁ గోరుచుండు। జనకుఁ జోనుంచు భక్తి
విశ్వాసములను॥ 7

గీ॥ ఒక్క తల్లికి జనియించి యొక్క యింటఁ। బెరిఁ
గిమనినట్టి నీదు సోదరులతోడ। సోదరీలతోఁ గల
హంబు నూపఁబోకు। ముదిదయ న్యోన్య మైత్రి
తో నుండు మెపుడు॥ 8

క॥ మఱఁదులఁ గను మెప్పుడు సో। దరుల గతిఁ జి
లుకలకొలికిఁ దగు గౌరవముఁ। ధర నెఱపుము
బావలయెడ। మఱి మామలయెడ నిరతము

మాన్యతవచ్చుర॥ 9

గీ॥ తోడికోడండ్రుతామెప్డుఁగూడియుండఁ
బోలుఁగాట్లాడిబూతులనుడువవలవ। దొకరి
యెడలోపముండిన నొకరుసహనమునువహిం
చఁదగునెదురొక్కఁబోవుటుడిగి॥ 10

క॥ వినుమాఁడుదిసదివినఁజేడు। ననియవి
వేకులువచింప నదియొన్నకునీ। మనమునవెద్దేమి
యెఱుఁగు। వనితాయడుకుల్లరుచిని వసుధాస్థ
లిలోన॥ 11

క॥ విద్యావిభవముజనులకు। హృద్యంబౌన
రించుఁగాదె యెంతయుఁదలఁపన। వేద్యులుతె
లుపుటవినవే। విద్యాహీనులఁ బసులనివెలఁదీనీ
వుర॥ 12

గీ॥ చదువులేకపోవుట చేతసఖియయిరుగు।
పొరుగువారితోఁగయ్యంబువొందుచుండు। గ
వ్వలనుగచ్చకాయలగడుపుచుండుఁ। గాలము
ను వ్యర్థమొనరించిఘనతఁబాసి॥ 13

గీ॥ చదువెఱుఁగనివధూటియసంగతముగ।
సారెకునునీచులచెలిమిఁగోరుమంచి। చెడ్డలగ్రి
హింపలేదు దుశ్చేష్టలఁగొను। వసుధనలువురి

లోనవ్వఁబాల్లఁగాంచు॥ 14

గీ॥ విభుఁడువిద్యాధికుండౌచు వెలయుచుం
డ। భార్యవిద్యావిహీనతఁబరఁగుచుండ। వారి
సంసారమేగతిబాగుపడును। గాటికొక రేటికొ
కరులాగంగలలన॥ 15

గీ॥ విద్యయన్నింటఁ బైపెచ్చు విలువహె
చ్చు। నిచ్చలునుమెచ్చుసౌఖ్యంబులిచ్చునెంతొ।
మంచిఁదెచ్చుఁజెడ్డనుబుచ్చుమగువవిద్య। వీలు
లేదనుటేమివివేకమొక్కొ॥ 16

గీ॥ విద్యమిక్కిలినేర్చినవినయముండ। వల
యునదిలేనిచోరసవంతమాని। యెంతసక్కఁగ
వండిననేమిఫలిత। ముప్పులేనికూరకురుచియుం
డునెక్కొ॥ 17

గీ॥ చదువునేర్చితిమంచునుజనదుబిల్వా। ణీ
యతారాశశాంకాది నీతిబాహ్య। మైనగ్రంథ
ములఁజదువఁగానుజెలియ। వానిపేరైననువినఁ
గవలదువలదు॥ 18

గీ॥ కాంతపనిలేకతీఱికఁగాంచునపుడు। కా
లమునువ్యర్థమగునట్టికార్యములను। బోవనీక
పతివ్రతపొలఁతులడగు। చరితములనుజదువవ



లేఁబరమభక్తి॥ 19

గీ॥ కుడిచికూర్చున్నఁబని లేక చెడుతలంపు
లుద్భవిల్లునేదైననీవొప్పుగాను। సచ్చరిత్రము
లఁజదువఁజర్చసేయఁ। గాలమెప్పుడుగడుపుము
కంబుకంఠి॥ 20

గీ॥ బీదసాదలఁ గడుహెచ్చు ప్రేమతోడ।
గాంచిసాయంబుసేయుముకసరఁబోకు। నీకుఁగ।
లశక్తికొలఁదినిలోకమందు। ధర్మమొక్కటెని
నుగాచుఁదలిరుఁబోఁడి॥ 21

గీ॥ జగతిపై జన్మమెత్తినసార్థకంబు। పరుల
కుపకారమొనరించు కొఱకుఁగాదె। యెన్ని కా
ర్యముల్సేసిననింతియెపుడు। మంచిచెడ్డలురెం
డునుమహినినిలుచు॥ 22

గీ॥ కాళ్లుసేతులు మొదలగంగములులేని।
వారికినిరుపేదలకునువలయునెపుడు। దానమొ
నరింపనిన్మెచ్చఁగానెయెముటఁ।బొంగిద్రవ్యంబు
వృథపర్చఁబోకుతరుణి॥ 23

క॥ ఇచ్చెదననిదీనులతో। నిచ్చకములనెదు
టనాడుచెగవేయుచురే। పిచ్చెదమాపిచ్చెదనని।
గచ్చులుసేయంగఁబోకుకమలసుగంధీ॥ 24

గీ॥ అతివయాచకతతినీసహాయుమడుగఁ జే
యునదిమానునదియుసు జెప్పివెయ్య। వలెను
వెంటనెత్రిప్పఁగవలదుమళ్లి। మళ్లిరమ్మనిపొమ్మ
నికల్లలాడి॥ 25

గీ॥ పతిగృహమునకుఁ దెచ్చుద్రవ్యంబు చి
ల్లిగవ్వయినఁగానివ్యర్థంబుగాకయుండఁ। బొ
దుపుగావాడవలెఁజుమ్మిపొలఁతిరొంచెదు। కర్చుల
ను జేయఁగానపఖ్యాతివచ్చు॥ 26

క॥ వదలఁగవలెదుశ్చేష్టలఁ। జదువఁగవలెఁ
బుణ్యసతులచారిత్రంబుల్। మెదలఁగవలెనా
థునిమది। ముదమగునటులెల్లగతులఁబూర్ణేందు
ముఖీ॥ 27

క॥ వినవలెవిబుధులచరితలఁ। గనవలెసచ్చె
లులగోష్ఠిఘననిభవేణీ। మనవలెఁగీర్తిప్రతిష్ఠల।
ననవలెనిక్కంపుమాటలనవరతంబున్॥ 28

క॥ సత్వముఁదాల్పందగున। జ్ఞత్వమువిడ
నాడవలయు సతిపనిలోదా- సీత్వముపతియెడఁ
దగులా- కేత్వసెప్పంగఁబోకుమెపుడర్థులకున్॥

క॥ నడువకుమాకుపథంబుల—గడువకుమా
భర్తయాజ్ఞఁ గలలోనైనన్— నుడువకుమాదు

ర్భాషల- విడువకుమా బీదలందు వెలఁ దిరో ప్రే
మగా॥ 30

క॥ స్రుక్కకుమిడుములఁబడియును- నిక్క
కునీవిభవముఁ గనినీరజనేత్రీ-చిక్కకు ముప్పుల
లోపల-మొక్కకుమితిమీాఱినీవుమేదినిలోనఁ॥

క॥ ఆడకు పతికలవునకేదు। రాడకురస
హీనపుఁ బలుకాడకునీతి। స్వీడఁగనాడకుధరఁ
బో। నాడకునీబంధుజనుల నబలామణిరో॥ 32

క॥ నవ్వకు కడుహెచ్చుగమన। నీవ్వకుదు
ర్మార్గజనులకెన్నఁడొకరితోఁ। జివ్వకుఁగాల్ద్రివ్వ
కుమతి।త్రివ్వకగతమున్గురించితామరసాక్షి॥ 33

గీ॥ గంగిరెద్దువలెఁ దనయంగంబునిండ। వ
స్తువులఁబెట్టుకొన్నఁ బ్రశస్తమౌనె। యతివకం
తకంటె మిగులయశముగాదె। సాయమొనరిం
పఁగాబీదసాదలకును॥ 34

క॥ అదిలేదిదిలేదనిపతి। నెదకుంగష్టంబు
లిడకుమెప్పుడునెలఁతా। ముదమొందుమున్నదా
నితో। సదమలమగుతుష్టికంటె సౌఖ్యముగ
లదే॥ 35

క॥ చెడుగులతోస్నేహంబె। య్యెడలను జే

యంగఁబోకుమి భరాద్గమనా। యిడుములపా
లౌదు బయ। ల్వడనీయకు వింటిగిట్టఁ బదుగు
రిలోన॥ 36

క॥ పతిపోరుగూరికిఁబోయిన। క్షితిలోసిం
గారమూనఁ జెల్లదుగరితా। సతతముపాతివ్ర
త్యల। మతముసుమాయట్టులుండ మదినర
యంగా॥ 37

క॥ పెద్దలువృద్ధసతులునీ। వద్దకువచ్చినను
లేవవలయును వారిఁ దద్దయుఁ గూర్చోమన
వలె। ముద్దియమర్యాదసేసిముదములరారఁ ॥38

గీ॥ సిరియదెంతయుండినఁ గానిధరణినంత
కంటెవేయిరెట్లడఁకువఁగానుదిరుగ। వలయుగ
ర్వమెన్నఁడునుదాఁబనుటఁదగదుశాంత మఖిల
గుణాలి భూషణముసూవె 39

క॥ సతినీదుసచ్చరితముకు। మతీజనులకిత
ములేమిమర్యాదవిహీ। నతయానెదానఁగుళ్కు
కు। క్షితిఁగిట్టనిచో ఘృతముప్రసిద్ధికిలోకే॥40

క॥ చాడీలుసెప్పఁబోకుము। చేడియమర్యా
దసెడును సిద్ధముసుమ్మీ। వీడుదురుపెద్దలుని
నుఁ గూడరు మఱునాఁటినుండి కోరికలో

క॥ మానముఁ మించియు వేఱే। కానముకో
మలికి ముఖ్యగతియయ్యాదిన। మ్మానము మూల
ము సేయుము। హీనముగా కుండ నెప్పు డెల్ల విధ
ములన్॥ 43

గీ॥ పతిగృహమునకు రాఁగానె వనజనేత్రి। వల
దు సంసార బాధలఁ దెలియఁబర్చ। నేదఁ బేరిన పిమ్మ
టఁ జెప్పు మెప్పు। డాతని మదికిఁ గష్టంబులఁ బనీకు॥

గీ॥ కించఁగొని నిన్ను మిగుల బాధించె నేనిఁ।
బతికి మార్గాటవచియింపవలదు సుమ్మ। కరము
కఠినచిత్తుఁడయినఁ గరఁగకున్నె। కలికి శాంతప
ర్పుమృదు వాక్యములచేత॥ 44

గీ॥ ఎంతసంపత్తిఁ గల్గిన నెంత సౌఖ్య। ముండి
నను గాని సంతతి యుండకున్న। శోభయిను మం
త యుండదు సుందరాంగి। దైవమును వేఁడు నీకు
సంతానమిడఁగ॥ 45

క॥ పిల్లలు కల్లలు పలికిన। నల్లరఁగా వించె నే
నిసదివారింపక। జెల్లును ముద్దించంగాఁ। జెల్ల
దటులఁ జేయఁబిదపఁ జెట్టగు లేమా॥ 46

గీ॥ తగదు బిడ్డల్లరఁ జేయఁదఱచుతినఁగఁ।

దల్లిమేదినియో యిచ్చి యోదార్చుచుండు। న
వలయట్టు లొనర్చనసర్థ మొఁదవు। వారి దేహము
లకటులవలదుసేయ॥ 47

క॥ పండుగులుశుభము లగుచోఁ మొండు
గవస్త్రవులువెట్టిమెలఁతలువిడుదు। రొక్కఁడిక
లనువీధులనె। న్నఁడదియువలదిలసవగుణంబ
గుమడఁతీ॥ 48

గీ॥ పొరుగువారిపైఁ గోపంబువ్రెడమఁదమ
దు నోరెఱుంగనిబిడ్డలనూరకేని। బాదుచుందు
రుపశువులవలెనుగొందఱ। రట్లుసేయఁగాఁ బోకు
మోయబలసీవు॥ 49

గీ॥ తఱచుగాబిడ్డలకుఁదమతల్లులగుణ। మ
లవడునుగానఁ బ్రిమిడగయ్యాళి వొచు। బుద్ధి
మాలినటింపంగఁబోకవిద్య। నేర్చినయవివేక
ముల్నెఱపుటొప్పు॥ 50

గీ॥ పణఁతిసీయెడఁబతికంటె గుణగరిమము।
లావుగానున్న వానికెల్ల సమయముల। లొంగి
యుండుమువిూఱకులోకమందు। సదియెయుత్త
మోత్తమగుణంబనుచుఁదెలిసి॥ /1

గీ॥ నాథుఁడింటికిరాఁగానెనాతిసీవు। బూచి

లాగుతలవిగయఁ బోసియుండ। వలదుశుభ్రము
గాఁగనఁ బడఁగవలయు। నెప్పుడతనిమదికిముద
మెసఁగఁగాను॥ 52

క॥ పెనిమిటితనపైమిక్కిలి। చనవునుగనఁ
బర్చుచున్న సతియాడఁకువతో। డనెనునఁదగుఁద
ననడువడి। ఘనులుమదినిమెచ్చునట్టుఁగా నిర
తంబుగా॥ 53

గీ॥ ఇలనునీదుపుట్టింటవారెంతధనికు। లై
నఁబతితోడఁ దేలోకమందునతని। కడనెయుండ
వలయుఁగాని కదలరాదు। చెలియమెట్టియిడు
ములగాసిల్లుచున్న॥ 54

క॥ పతిగడియించెడి దినములు। పతివకుగు
సగుసలులేనియట్టి తరుణమం। దతిరోసరోసలు
నుగూడదు। మతిసమముగనెప్పుడుంచ మర్యా
దనుమా॥ 55

క॥ మంచుఁలువాకులువెట్టిన। సుందరిప
తిలోఁ బడునను చుండలఁపకుమా। డుండమున
దానవ్యాధులు। వొందియునుపుష్ప వేగమ
ప్రాపునుజూమా॥ 56

గీ॥ స్వప్నమందైన నాథునిభావమునకు।

మిగిలినడవక యాతండు మెచ్చునట్టు! లనయ
మును మెలఁగుట యెవశ్యాప్రథంబు! సకియమం
త్రతంత్రములు బూటకము లెసుమ॥ 57

గీ॥ చానసీతోడఁ బతిరహస్యంబువల్కఁ
జెలులతో నైన నెన్నఁడుఁ జెప్పబోకు! చెడుప
డంతులు లేనివి సెప్పినీదు! పతికివిరసంబు పు
ట్టింతు్రభావమందు॥ 58

క॥ పతిహితులనాదరించుచుఁ బతిశత్రుల
విడువఁగాను వలయును వారల్! సతినీకుమిత్రు
లైనను!క్షితిఁ గోపలగౌరవంబు సేకురు దానన్ 59

గీ॥ మోదహీనుఁడైనను దానుమోదహీ
న! యగుచు మోదభరితుఁడైన నతివమోద
భరితురాలౌచు నాధుని స్వాంతమునకి! తంబు
గనడవవలెఁబూవితావిఁబోలె॥ 60

గీ॥ విధివశముచేతనీకుఁ బ్రాప్తించినట్టివ
రుఁడు బుద్ధిహీనుండుని ర్భాగ్యుఁడైన! నెట్టిరూ
పహీనుండైన నెంతమాత్ర! మతనియనుమతి
దాఁటరాదబలనీవు॥ 61

గీ॥ భర్తయుండుండు జ్ఞానసంపత్తినీవు! గొ
ప్పగానెంచవలయు దుర్గుణములగని! యింపఁ

గారాదు కల్లనైన నీగుడుఁబోఁడి పరునిపొం
దెంచవలెఁ దృణప్రాయముగను॥ 62

గీ॥ కీర్తి వచ్చిన మఱియపకీర్తి వచ్చె। నేని
సుదతి కారణమండ్రు నిజముగాను। బతికివాని
కెన్నఁడును లోపంబురాక। యుండబుద్ధిఁగల్గి
నడచుచుండవలయు॥ 63

గీ॥ వనితపుట్టింటఁ గలపరిజనముకంటె। న
త్తవారిసేవకులనత్యధిక ప్రేమ। నరయుమాఁడు
బిడ్డలయెడనత్తలయెడ। వినయమునువిధేయాత
నుజూపింపవలయు॥ 64

గీ॥ నీకుభృత్యవర్గంబుపై నిశ్చయముగ।
నెంత ప్రేముయుండినఁ జనవిన్వఁబోకు। మొప్ప
గా నీయెడల భయముంపవలయు। నట్లుమసలం
గఁ జేయుమోయన్నుమిన్న॥ 65

గీ॥ ఎఱిఁగి యెఱుఁగక నీచోటనెన్నఁడేని।
దాసదాసీజనముతప్పఁ జేసెనేని। వారినిఁకఁ జే
యకుడని చీవాట్లఁ బెట్టు। మబల దానినేపట్టి
పాలార్చఁబోకు॥ 66

క॥ పండుగపబ్బములగునెడ। నిండగుభక్తిం
జరించునీసేవకులకు పొందుగఁ దనుపు మఱేను

బవ, కంఠంగభోజనమొసంగికువలయనేత్రి॥ 67

ఆ॥ వె॥ వేలకొలంది నీకుభృత్యులుండినఁ
గాని! వరునకీవె సేయవలయుఁ బనులు! ఎంత
రాణివాసమింటఁ బుట్టినఁగాని! నారిభర్తకును
అతి పరిచారికెయగు॥ 68

తే॥ ఒరులునుతియింప మదిలోన నుబ్బఁ
బోకు! సేయుదానము వెల్లడిఁ జేసికోకు! క్షితిఁ
గలుషములనీదరిఁజేరనీకు! లలనసత్కార్యమం
దువలదు పరాకు॥ 69

గీ॥ ఎన్ని సౌఖ్యంబులుండిన నెందుకొరకు
దేహసౌఖ్యంబు లేనిచోఁదెలివనీకుఁ! గానఁగా
పాడుజాగ్రత్తగానుసతము! స్నానపానాదివిధు
లనుసల్పుచుండి॥ 70

ఆ వె ఒ స లకలిమిఁజూచి యోర్వలేనితన
ము! బూనయోగ్యమానెదాననేమి! వచ్చుభా
మినిమదినెచ్చుదయివమును! సంస్తుతించుమధి
కసంపదలిడ॥ 71

ఆ॥ వె॥ పనియుఁబాటులేకపలుమారుపొరుగిం
డ్ల! కేఁగఁబోకునిన్ను నెల్లిదముగఁ! జూతురది
యుఁగాకనోతి నిందలుపచ్చు! గౌరవంబునీకు

దూరమగును॥ 72

క॥ ఏకాంతస్థలమున నీ। వే కాంతముగ నుతు
లోడ కేనియుఁ బలుకం। బోకుము లోకులు కా
కుల। మూఁకలు లోకంబు మూయమూకుఁ డు
గలదే। 73

ఆ॥ వె॥ ఎంతరూప హీను లేనియుఁ బరుల
సం। తతనిఁ గాంచి నవ్వఁదగదు బోఁటి। కటకటద
యుప మిటుగా వించెనని జాలిఁ। బొందుటొప్పు
మిగుల డెందమందు॥ 74

గీ॥ పరులు బలు కష్టముల చేతవనటఁ జెంది।
వసుధనీదు సాయంబును బడయఁదలఁచి। నిన్నుఁ
బ్రార్థించవిను వక సన్నుతాంగి। చేతనైనట్టి మే
లును జేయు మెప్పుడు॥ 75

గీ॥ ఒట్టులను మాటిమాటికిఁ బెట్టఁబోకు। క్షి
తిని దొంగతనం బెప్డుఁ జేయఁబోకు। జిహ్వకింపు
గాఁ బాకంబు సేయ నేర్చు। కొమ్మ కుట్టుపనిఁ దెలిసి
కొమ్మ కొమ్మ॥ 76

గీ॥ ప్రాణికోటిపై దయ నిల్పు మాత్మ లోనఁ।
జామహానిఁ జేయకుము నిష్కారణముగ। నఖిలధ
ర్మముల కమూలమాయహింస। యంచుఁ బెద్ద

లుసెప్పుటనెంచఁగలదె॥ 77

గీ॥ ఎంతలేమిచేతను గృశియించుచున్నఁ।
బుట్టినింటికిమఱి మెట్టినట్టియింటి। కిలను జెట్టఁదే
కుండనీ వెఫ్ఘనడవ। సలయుగుట్టుమట్టుఁగలిగిపం
కజాక్షి॥ 78

క॥ బోటిరో కోపముఁబూనుట। వాటము
గాదనుచుఁ దెలిసినదంట నుదానిన్। సూటిగ బా
లురు బంట్లును। బోటిం దోలంగునెడఁ బూనవల
యునుజువ్వా॥ 79

గీ॥ పొంచివినఁబోకు మొరులాడమించుఁబోఁ
డి। రోరహాస్యమదియ యుక్తమారయుఁగను।
బరులు సేసిన మేలును మఱవఁబోకు। మిహపరం
బులకటు లైననెడఁ జునవచ్చు॥ 80

క॥ పెద్దలమదికి హితంబుగ। నెద్దికఁజరి
యించుచుమఱి యొప్పుగ నాజ్ఞల్ హద్దుగనొనరిం
పందగునద్దావన్ శ్రేయము బ్బునవనీస్థలిలోన్॥ 81

గీ॥ నక్క వినయమును బకధ్యానంబుసూపి
చెలువ కార్యమగువఱకు స్నేహమునకుఁ బాత్రు
లైయుండి పిమ్మటఁ బాయుచుంద్రు కొందరట్టి
తుచ్ఛులఁగనుఁగొనఁగవలెను॥ 82

గీ॥ వట్టినే లేనిపోనట్టి వంతమూని ।
మాటిమాటికిఁ గొందరుబోఁటులలిగి। భోజన
ము మానుకొనుచుంద్రు పొలఁతియదియుఁ
గూడదంచెఱిఁగినడచుకొనఁగరాదె॥ 83

క॥ మృదుసంభాషణ సుగుణము, హృద
యానందంబుఁ జేయునెంతయుఁదలఁపఁగ। మదవ
తిరొపలుకునెడను। మృదినుంచంగవలయు మఱి
వకదానిఁగ॥ 84

గీ॥ పనులుసేసినఁ గీర్తి లోపంబురాదు; భు
వినిరాణివాసముఁ దగ్గిపోదుమఱిజగమునఁదొ
య్యలిదేహసౌఖ్యంబుగల్గు। వినయవంతురాల
వటంచుఁ బేరువచ్చు॥ 85

గీ॥ పనులఁ జేయక మహారాణివలెన్ని దిను
చుఁ। గూర్చొనుట గొప్పగా నెంచుకొకుతన్వి
దానిచేనజీర్ణంబు మొదలగు పెక్కు। రోగముల్సం
భవించు నిరూఢిగాను॥ 86

గీ॥ మానినీయెప్పుఁడెలవాఱఁగానెవేగ, లే
చి తీర్పంగవలయును బ్రాఁచిపనుల,వలదుప్రొ
ద్దెక్కుదాఁకను బండుకొంట,లేనిచోనిన్ను మొ
ద్దంద్రు మానవతులు॥ 87

గీ॥ పెండ్లిపేరంట్రములకేఁ గవిద్రుమో
ష్టు। లెరవు నగలధరించెద రెంతొ ఘనత। వడ
యనదితగునె గుణసంపత్తి కంటెఁ। గలదె స
ద్భూషణము వేరె జలజవదన॥ 88

గీ॥ నీసగలు నాకెముల్పూనిచినన్ను మెచ్చ
రెపుడు సజ్జనుల్వారల హృదయమందు। నీకు
గలనమ్రభావంబునీతిఁ గాంచి। ఘనముగా మె
త్తురేకానికాలిలుగంటి॥ 89

గీ॥ కడుపునందొక్క కొమరుండుగల్గిమఱి
యుఁ।గోడలుతమకురాఁ గానెకోసిపెట్టు। సాగు
చంద్రముపూర్వావస్థ జప్తిలేక। మూఢవనితల
టులఁ జేయఁబోకుమెపుడు॥ 90

గీ॥ అత్తలాడుఁ బిడ్డలును దమ్మనవరతము
మిగుల శ్రమఁ బెట్టుదురటంచు వగలుపూని
పొరుగువారితోఁ గొందరు మొఱ్ఱవెట్టు। చం
ద్రమ మూర్ఖతయది తగదుగ్మ్ఖులకు॥ 91

గీ॥ కష్టములురాఁగ ధైర్యంబుగాంచఁగా
ను। వలయునెత్తి బాధుకొనియేడ్వంగఁ బోల।
దటులఁ। జేయంగమదికి నాయాసమబ్బుఁ గొం
చెమైనన్ను లాభంబుగూడిరాదు॥ 92

గీ॥ పడఁతిపిల్లి మీఁదనుక్రోశిప్పై నునెపము
పెట్టితలచుగాఁ గొట్లాడితిట్టుకొంద్రు బుద్ధిహీను
లై కొందరుపొలఁతులదియుఁ దగదటంచెఱిఁగి
మెలంగఁదగును జుమ్మ॥ 93

గీ॥ కాంతరో యింటిగుట్టు లంకకును జేటు
నడి విధంబుగాఁ జాటుననిన్నుఁ గేళిసేతురిర్గు
పొర్గుజనులుసిద్ధమిదియు। యెంతబాధైనలోన
సహించవలయు॥ 94

క॥ వినుమెప్పు ఋణమొనర్చకు। మనోహ
తునిచాటుగాను మఱిశక్తికిమించి। చినవాగ్దాన
ము సేయకు। ననఁబోఁడిరొ గౌరవంబునకు ను
న్నయగుణ॥ 95

గీ। ముదితమొక్కకు భర్తకు ముందుగాను
భువినిఁ బిల్వనిపేరఁటమునకుఁబోకు। మెప్డుఁజె
ప్పుడు మాటలాలించియెదుట। వారినిమదిని
దూషింపవలదుసుమ్ము॥ 96

గీ॥ భోజనముఁ బెట్టువేళలఁ బువ్వుఁబోఁడి
పంక్తిభేదంబుసేయకు వసుధలోన। నట్లుసేసి
నఁ గీర్తికిహానికరము। వచ్చుబడిఁ గాంచిమఱి
సేయవలయుఁగర్చు॥ 97

గీ॥ ఎవ్వఁ డేది సెప్పినఁ జెవియిచ్చి వినుము। వీ
రునాకుఁ జెప్పెడి పాటివారె యంచు। విఱ్ఱవీగు
టఁ గూడదు బిసరుహాక్షీ యందుమంచియున్న
ను దానికనుమతించు॥ 98

గీ॥ మెలఁత కొందరు కడు పార మెక్కి తమకుఁ
బనియుఁ బాటును లేకుండ వారలట్టి। వారలిట్టి
వారని పొర్గు వారిలోపముల గణింతు। మూ
ర్ఖతయది తెలియవలయు॥ 99

గీ॥ ఎన్ని పనులున్న మఱవక సన్నుతించు। ప్ర
తిదినంబును దేవుని భక్తితోడఁ గొంత ప్రొద్దు వు
నిర్మల స్వాంతమందు। నిఖిల సౌఖ్యంబులొడఁ
గూర్చి నిచ్చు మనుప॥ 100

గీ॥ యువతులకు హెచ్చుగా నుపయోగపడఁ
గ, బుస్తకంబునకు సతీసుబోధిని యని, పేరిడి ర
చించె నెంతయు వెలయునట్టి, యోజదాట్ల సీతా
రామరాజు దీని॥

క॥ హితమతులై సంతతమిా, సతీసుబోధినిఁ
బఠించి చరియించినస, న్నుతిఁ గాంతురు పణఁతు
లుక్షితి, క్షితి లేని సుఖంబుఁ జెందిశ్రీహరి కృప చేత

సతీసుబోధిని సంపూర్ణము.

